# విజ్ఞా





ఆంధ్రమహాజనులారా!

నేను అనంతపురమండలములోని హిందూపురం తాలూకునందుగల కల్లూరు వాస్తవ్యుడను. చిన్నతనముననే కవిత్వములవడి, యష్టాదశశరద్వయస్కుడనగుటకుముందె యీ క్రిందిగ్రంథముల విరచించితిని. కాని జనధనసాహాయ్యంబులు లేమిచేసి—(1) సత్యలీలాలహరి (ప్రబంధము). (2) కృష్ణార్జునీయము (నాటకము). (3) అమృతవాహిని. ప్రథమభాగము. (4) ద్వితీయభాగము (నవల). (5) పద్యావలి మంజరియూ వైదర్భీవిలాసము (మంజరీద్విపదగీతములు). (6) ప్రభాతము, లేక, హిందూదేశచరిత్రరత్నాకరము, ప్రథమపాదము—అను గ్రంథములన్నియు ముద్రణముగానక నిలిచిపోయినది. అయినను కొందరు ప్రముఖులు ద్రవ్యసాహాయ్యము చేయ సమ్మతించినకతంబున, వానిని ద్వరలో బ్రకటింపదలంచినాడ. ఈయాంధ్రీ సాధ్యమము, సులభము గాకున్నను, భాషాభిమానులనుగ్రహించి దత్తమండలమున సారస్వతపోషణము తక్కువయను శోచనీయాంశమును కొంతవఱకైన దీర్పనెంచి పోషకులయ్యెదరను ధైర్యము వహించుచున్నాను. పాఠకులు చందాదారులై, చందాదార్లను ప్రోగుచేసి, భాషాసేవచేయుదురుగాక. పోషకులకు రు 25-0-0. చందాదార్లకు రు 3-8-0 మాత్రమే.

ఇతరులకు రు 8-0-0. ఆంధ్రీకార్యమునకుఁ దోడ్పడుటకై పారింబోరిఁ శాస్త్రులు.

ఈపద్యత్రిదశకము నాతుకవితా మున్నురచించి యుండి మాద్రికిగాను, రా॥ శ్రీ॥ సద్దికూటి తిమ్మారెడ్డిగారి సాయమున నిప్పుడు ప్రకటించితిని. రసికులిందలిగుణంబుల గ్రహించి, దోసంగులుండిన తెల్పెదరని కోరుచున్నాఁడ.

ఆత్మకూరు,
ది 10-8-1920.

ఇట్లు,
కల్లూరు యజమాన వెంకటనారాయణ రావు, బి. ఎ. విద్యార్థి.



శ్రీసత్యపర … నమః

# శ్రీకృష్ణ … ము

క॥ శ్రీరమ్యగుణాని శాంతుఁడు
పారావారస్థ నాగవల్లభతల్పుం
డారాధ్యుండిడెడున్ వం
దారుజనావనసమాఖ్యుదనరన్ శుభముల్.

ఉ॥ శ్రీరజతాద్రి సర్వసుర
సేవితుఁడై చెలువొందునాథు నం
భోరుహసన్నిభంబయిన
మోమును వేడ్కఁ దదర్థదేహనీ
హారనగాత్మజాత, కని
యంచితహాసము సేయఁజూచినం,
తేరహినర్థమ్మున్ గనని
తీరున నవ్వగజాస్యుఁ గొల్చెదన్. 2

చ॥ సురుచిరహాసచంద్రికకు
సొంపున నలయుమిచక్రివాకులె
ల్లరు సుఖయుక్తులై మనఁగ
లక్ష్మియురస్థలిలోరహింప సా
దరహృదయ ప్రవృత్తికిని
ధానమనంగనెవంగు చక్రిహా

యరగోలుద్భవింపనటు
లారసిప్రోచుత నిచ్చనిచ్చలున్. 3

శా॥ చింతింతున్ మదభీష్టసిద్ధికయి రా
జీవాప్తకన్యాపగా
కాంతోర్వీన్ వ్రజసుందరీయుతుఁడవై
కాంతాంబుజాతద్వయ
శ్రాంతపస్త్వరవేదికన్ వెలయు నీ
కల్యాణరూపంబు మ
త్స్వాంతాగారమునందు సంతతము కృ
ష్ణా! భక్తసంరక్షకా! 4

శా॥ సంగీతంబును సాహితీత్వము బృహ
త్సైర్యంబున్ సన్నుతా
సంగాకారవిలాసమున్ సుకవితా
జ్ఞానంబు విశ్రాణనం
బుం గాంగేయనగస్థిరత్వమును సం
భూతంబు లుత్పత్తితో
నింగిన్ శీతసమీరుఁడుట్టుపగిది
స్త్రీప్రాత్మసంరక్షకా! 5

శా॥ పారావారపరీతభూతలలస
త్ప్రస్థానషట్కంబు నీ

హారాహార్యనివాస సంభృతధు నీ
హార్ద్రావగాహంబులున్
శ్రీరామాంఘ్రి సమర్చనాశతములున్
జెల్వొంది తూగంగలే
వౌరా! మాతృనమస్సమానముగ కృ
ష్ణా! భక్తసంరక్షణా! 6

మ॥ ఘనవన్యాటనమాజసాఖ్యదము గో
కల్యాణ సంపాదకం
బున వాకారమునేలకిచ్చుజిలుగున్
బుట్టంబు సర్వత్రసా
ధ్వని తాంతోజ్వలశాద్వలస్థలమునే
దన్, దూదిలేపుల్గొనన్
జనునే మానవరాజకిన్ జగతిఁ గృ
ష్ణా! భక్తసంరక్షణా! 7

మ॥ శివుఁడో కేశవుఁడో యధీశ్వరుఁడుగన్
జిత్తాంబుజావాసిగా
గ, వనంబందుననో పురంబుననో, సా
ఖ్యాకాంక్షుఁడౌ మానవుం
డు, వసింపన్ దగు, సార్వభౌముఁడో యతీం
ద్రుండో సుమితుండు కా

నవతారుణ్యశుభాంగిభార్యగ ననూ
నదివ్యభాగ్యవిభవా
ర్ణవమగ్నుండయి భాసిలన్వలెను గీ
ర్వాణావళీ రక్షణా! 8

మ॥ మహిలో మానవులెంత తీవ్రపడి సం
రంభంబునన్ దోర్బలం
బహమున్ రేతిరియున్ రచించియును నా
హా! పొందగానేరరా
వహనీయంబుల లంఘ్యముల్, హరిరమా
పద్మాక్షిఁ బెండ్లాడెమూ
డహరుండుష్ణహాలాహలంబుఁ గుడిచె
న్దాక్షిణ్యతన్ ధైర్యధూ
ర్వహులౌ కావ్యపు లబ్ధిఁద్రచ్చునెడఁ గీ
ర్వాణావళీ రక్షణా! 9

మ॥ అరయన్ సాహితిలేనిమానవుఁడు మా
తాపేతుఁడా డింభకుం
డు రణోద్ధత్యముఁ బాసినట్టి నృపుఁడున్
దుర్వృత్తినాథార్తిలే
శరహీన్ బొల్చునిషార్తియున్ నిరతమున్
గమ్రీడమాదూరుఁడా



వరవిద్వన్నిధిలెక్క కెక్కరిం నా
పన్నావళీ రక్షణా! 10

శా॥ మాపున్ రేపుగడింది శ్రీద్ధజన స
మ్మాన్యుల్ ఋషీశుల్మదిన్
బ్రోవున్ దాపును నీవయంచుఁ దలఁపన్
భద్రావళుల్గల్గెనాఁ
బాపల్చెప్పగవిందు వారలిలలోఁ
బాపిష్ఠిదారిద్య్రతా
కూపంబందు తపింతురెందులకు? ర
క్షోవైరి సంరక్షణా! 11

మ॥ స్వనివేశంబునఁ బూజమూర్ఖుఁడుగొనున్,
స్వాగ్రిమమందప్రభుం
డనయంబున్నతినొందు, గౌరవమునం
దన్నేర్చుభూనేత స్వా
వని, విద్యాలసితుండు కీర్తిఁగను న
వ్యానంత నశ్రాంతమున్,
వినుతింపన్ దగుసత్కళావిదుల నె
వ్వేళన్ మహీరక్షణా! 12

మ॥ ధరపై నైజగుణాళులెట్టివను తా
త్పర్యంబులేకన్ జను

ల్వరులఁ హేళన సేయుచుందురు నిజ
పార్థబ్ధముఁ దల్వరె
వ్వరు, నాపన్న కలాపముఁ నవుదురె
బ్భంగిఁ న్వసీలపభ్రం
గురిగింజ త్తెలియంగ నేరనటు ర
క్షో వైరి సంరక్షణా! 13

మ॥ సుగుణోద్భాసితయా కళత్రమును వం
శోద్ధారుఁడౌ పుత్రుఁడుఁ
నగరాజేంద్రసుతాధవస్మరణయుఁ
నానాకళాజ్ఞత్వముఁ
ఖగమంత్రిప్రతిభావిశేషమును రా
కాచంద్రసౌభాగ్యముఁ
జగతిఁ గోరయుఁగావు సాధ్యములు కృ
ష్ణా! భక్తసంరక్షణా! 14

శా॥ ఉద్యచ్చండమయూఖసన్నిభులు ప్ర
త్యుత్పన్నధీసంయుతుల్
సద్యోధ్వస్తసమస్తకిల్బిషతతుల్
సద్భాసుపర్వాళ్ఘనా
విద్యావిష్టమనఃప్రదీపకరులై
వ్వేళఁ విజృంభించిరఁ

హృద్యంబై నెగడుఁ జగత్ప్రియము శ్రీ
కృష్ణా! సుధీరక్షణా! 15

మ॥ ధరణిన్ సంపదలెల్ల సర్వసుఖసం
ధానక్రియాభవ్యముల్
కరముం గూర్తుమటంచుఁ జేర్తురుజను
లాకామ్యార్థసంసిద్ధికై
నిరతోదీర్ణముదావహంబయిన నం
దీప్తాచ్ఛకైవల్యమే
నరుఁడుం గోరఁడిదేమిచోద్యమొకో! కృ
ష్ణా! భక్తసంరక్షణా! 16

మ॥ నియతిగ్రామణులైన సంయములు హ్రా
న్నీరప్రసూతస్థితా
వ్యయులై ఖ్యాతిఁ గడించియుం జగతిమా
హాకృష్ణమానాత్ములై
నయముం వీడిరిగాదెముం మనుజుల
జ్ఞానుల్భవన్మాయని
ర్భయులై నిన్నెడదన్ దలంపరు నిలిం
పవ్రాతసంరక్షణా! 17

మ॥ దినముం మానవులొండొరుం గని మదో
ద్రిక్తాత్ములై క్షేమమే

యని ప్రశ్నించుచు హంసప్రాక్షిఖరిపై
నావిర్భవంబంది వే
గనపాథోధిమునింగి యాయువునిలన్
గ్రార్యంబునన్ దస్కరిం
పనరస్తోమపుసేమమెక్కడిది? ధ
ర్మామ్నాయసంరక్షణా! 18

మ॥ ఉపకారంబునొనర్పరాదిల నభీ
క్ష్ణోద్యన్నికృష్టాత్మమా
నపవిత్రాధ్వచరిష్ణుసంతతికి, స
ర్పానీకమున్ బాలుతో
డపవత్రియుఁ బెంచియున్ విషమునే
లా వీడవీయుర్వి? భూ
మిపవంశాంబుధి శీతభాస్కర! రమా
మిత్రా! సుధీరక్షణా! 19

శా॥ సంతృప్తిన్ గననట్టి విప్రవరుఁడ
శ్రాంతంబు సంతోషిత
స్వాంతుండా నవనీధవుండు నిలలో
పాందరిద్రిపాపేతయా
కాంతారత్నము, హ్రీప్రపూరితసుహృ
త్కంజాతయా వేశ్యయున్

చింతల్ జెంది విపన్నమగ్నులగుదుర్
శిష్టపరిజారక్షణా ! 20
శా॥ ప్రాముఖ్యంబునుఁ గన్నవారియెడ న
ల్పంబైనదోషంబు చా
లన్ మాలిన్యముఁ దెచ్చు నల్పులయెడన్
లావైన దుష్కీర్తి యీ
భూమిన్ వన్నెకులోటుతేదరయగాఁ
బూతంపు క్షీరంబునన్
గోమూత్రంబుకణంబుఁ జాలు చెఱుపన్
గోసార్థసంరక్షణా ! 21
మ॥ అవనిన్ స్వశ్వశురాలయంబులు నిజం
బత్యంతసంతోషసం
భవసంస్థానములై చెలంగువారియో
మానంయుతుంప్రాచు భూ
రివనస్థానశయానుఁడై మెసఁగుగా
రిన్ గూడివెల్గున్ స్వయం
భవుఁడాహార్యశిఖావిటంకమున సా
మాన్యోత్కారంబందులన్
నివసింపంగఁ దలంచుటబ్రియమొకో! మా
నిస్త్రోమసంరక్షణా !

మ॥ విషమైపోల్చెదు నభ్యసింపనియెడన్
విద్యావిశేషంబు బ
ల్కృపిలేకున్న, దరిద్రమానవునకున్
కీర్త్యుజ్జ్వలద్గోష్ఠులే
విషరూపంబువహించు, వృద్ధునకు నీ
విశ్వంబునన్ గాంతయే
విషమెవ్వేళనసాధ్యమైనవిషమీ
పృథ్విన్ సుధీరక్షణా! 23

మ॥ అలఘుప్రోజ్జ్వలదాశుగాశనశిఖా
గ్రాలంబిరత్నద్యుతిన్
బాలుపాటన్ గని డగ్గఱన్ జనునె? సు
ప్తున్ నత్త్వయూథేనునిన్
మలయన్ శక్యమె? విద్యదాఢ్యుఁడని దు
ర్మానిన్ సమీపింపఁగా
కలుగన్ బోదుసుఖంబు నిక్కమిది భ
క్తవ్రాతసంరక్షణా! 24

మ॥ అలఘూర్త్తుల్వనరుద్ధలోపముఖుల్
స్వాభీష్టసిద్ధ్యర్థజా
తలసచ్చందన శీతలప్రథిత వా
గ్ధారేయులుద్యత్ప్రథా

నలకీలాలికళంకితాత్ములుగనన్
సర్వోదయద్గూఢధీ
కలితుల్వీరలె మంచివారలట భ
క్తవ్రాతసంరక్షణా ! 25

శా॥ గర్వంబంది సతీసుతాదికము సౌ
ఖ్యంబంచు వాటించి యా
నిర్వాణంబుఁదలంపరెవ్వఁడు నరు
ల్నిక్కంబు వర్తించు నీ
యుర్విన్ సర్వముఁ బ్రాగ్భవప్రభవమై
యొప్పారు సుజ్ఞానమున్
నేర్వన్ జాలుదురే బ్రయత్నముల ? వా
నివారిత సంరక్షణా ! 26

మ॥ అనయంబున్ గుజనప్రమర్దనము సౌ
ఖ్యప్రాప్తికిన్ మూలమై
ట్లన భేరుల్కడుదుష్టసైంధవము స్వ
ర్ణంబున్ మహామాధురీ
జనకంబైన పదిక్షుఖండచయమున్
చక్కంబడున్ ఘుట్టనం
బున, శిక్షల్గుణవృద్ధిదంబులుకదే !
పుణ్యప్రజత్రాణనా ! 27

మ॥ వరగంగాయమునానదీసికతభూ
భాగంబునం దిందుశే
ఖరహృత్ప్రీతిదమైనవృత్తి వ్రజరా
కాచంద్రబింబాననో
త్కర సంవేష్టితరానహేలజలుపన్
గైవల్యమున్వీక్షణన్
సురభుల్గాంచెడి నిన్ను నుతింపదరమే
సుత్రామసంరక్షకా! 28

సీ॥ శ్రీనాథ పాదాబ్జ•చింతనానిరతి వి
జ్ఞానసామ్రాజ్యధి•నాథుఁడగుచు,
సాంద్రయశశ్శ్రీస•మద్ధిమకూటిశుభాన్వ
యామరాధ్వమునకు•హంసయగుచు,
వెంకటార్యకళత్ర•విఖ్యాతపాపమ
గర్భశుక్తిసుముక్తి•కంబునవుగు
యాచకానీకబ్బ•హద్వాంఛలొనఁగూర్చి
యుచ్చకీర్త్యాచ్ఛాదితాశుఁడగుచు

గీ॥ ప్రబలి యాగ్రంథముద్రణ•పరత నెనఁగ
నెవ్వఁడట్టి "తిమ్మారెడ్డి"•కింపుగాగ
ననుపమానయశోద్రవి•ణాయువులిడి
కరుణఁబ్రోచుత నిచ్చలు•నరుని సఖుఁడు. 29

మ॥ అలవాసిష్ఠసగోత్రుఁడన్ వడుగు నా
డాఖ్యాన్వయుండేను ని
స్తులకల్లూర్యజమానపట్టవిలసత్
సుబ్రాయపుత్రుండ రా
జిలుదన్ వెంకటనారయాభిధ సుధీ
చింత్యంబుగాగన్మదిన్
లలినూహించి రచించితిన్నియనుఁ గ
ల్పస్థాయులౌ గావుతన్. 30

శా॥ శ్రీకాంతాకుచభాక్స్వటీరవిలసత్
శృంగారవక్షుండు, మో
తాకాంతాచరితోజ్జ్వలజ్జపవిశి
ష్టాచారసంపూర్ణను
శ్లోకానీకశుభప్రియుండెపుడుఁ గా
రుణ్యామృతంబుట్టు వీ
తాకాదంబినిఁ బేర్చుఁగాత సుమన
స్సన్సర్పభుక్స్వం త్రిపై. 31

ఓం తత్ సత్.



# లఘుటిప్పణి.

1. నిశాంతుఁడు=ఉనికిపట్టయినవాఁడు.

2. గణపతిశైశవదశ వర్ణింపఁబడినది. నీహార=మంచు.

4. రాజీవాప్తకస్యాపగ=యమునానది. కాంత=మనోహర, ప్రస్తర=రాలు.

5. పుట్టు=జననము. విశ్రాణనము=దాతృత్వము.

6. ప్రస్థాన=యాత్ర. అహార్య=పర్వత. ధునీ=నది.

7. శాద్వలము=పచ్చిక. ఏదగన్=మానగా.

8. దరిద్య్రభాక్ప్రభవ=ధనముచేపొందిన వైభవము.

9. రచించియూ = ప్రదర్శించియూను. కాశ్యపులు = దేవతలు.

10. రహిఁబోల్చని=మానముగా మనని.

12 నవ్యావంత=క్రొత్తదేశములో.

13. ఆపన్నకలాపముఁ=విపత్తుపొందినవారిగుంపు.

14. నగరా...నుకాధవ=శంకరుఁడు. ఖగ=దేవ.

15. ప్రత్యుత్పన్నధీ=సమయస్ఫూర్తి.

18. హంస=సూర్యుఁడు. ప్రాక్శిఖరి=తొలిగట్టు.

19. అభీక్ష్ణోద్యత్=మాటిమాటికిని పెరుగుచున్న. అపవిత్రాధ్వ=శుద్ధమార్గమున. చరిష్ణుఁ=తిరుగ వాంఛించువాఁడు.

20. త్రపా=హ్రీ=సిగ్గు. అకేత=లేనిది. సుహృత్=మంచి.

21. పూతంపు=స్వచ్ఛమైన.

22. పిటంకము=మేడ. వన=నీళ్ళు. స్వయంభవుఁడు = శంకరుఁడు (చూ. శివపురాణము.)

24. అశుగాశన = పాము. అలఁది = వ్రేలాడుచున్న. సత్వయూథేశాన్=సింగము.

25. వనరుట్=కమలము. కీల=మంట.

26. ప్రాగ్భవపరిభవమై=తొలిజన్మపుఫలమై.

27. త్రాణనా=రక్షకా.

28. సుత్రాము=ఇంద్రుఁడు. సుగభులు=అప్సలు.

29. అర్య=కృషీవలుఁడు. శుక్తి=ముత్యపుచిప్ప. అనీక= గుంపు.

30 వడుగునాథాఖ్యాన్వయుండు=బడగవాడను పేరిటి కులమువాఁడు.

31. కాదంబిని=మేఘమాల. సుమనస్=దేవతలు, మంచి మనస్సుగలవారు. సర్పభుక్=నెమలి. రూపకాలంకారము.

---

Sreo Savitri Press, Cocanada.